ఇల్లాలు : అలాగని యింత అన్యాయమటండీ.

శర్మ : ఏంజేస్తాం . చెప్పమ్మా ... అలావుంది ఇళ్ళకరువు. నేనొక్క మాటడుగుతా - మీరంతా గవర్నమెంటు వుద్యోగులుకదా ? గవర్నమెంటు హాయిగా యిళ్ళుకట్టి మీకివ్వకూడదూ ?

గోపి : ఇవ్వకేం ? ఇస్తున్నారు. పెద్ద ఉద్యోగస్తు లందరికీ బంగళా లిస్తున్నారు.

శర్మ : వాళ్ళకెందుకు ?

గోపి : ఎందుకంటే అధికజీతాలు పుచ్చుకొంటున్నారుగనుక. ఇంగ్లీషువాళ్లే ఏర్పాటుచేసి వెళ్ళారండీ యీ విధానం. ఎవడికి వేలవేల జీతాలో వాడికే అన్ని అలవెన్సులు, అన్ని సౌకర్యాలు ...

శర్మ : ఇంగ్లీషువాళ్ళు చేసిపోతే మనవాళ్ళు వచ్చారుగా మార్చరాదూ ?

గోపి : మనవాళ్ళు !!

శర్మ : మరింక డబ్బు సంపాయించడమే పనిగా పెట్టుకొన్న నాటుకోటు శెట్టియార్ల నంటే ఏంలాభం చెప్పు. ఊం- సరే నా కెందు కీగొడవ? వున్నప్పుడిచె ప్తే వురివేసే కాలం యిది. ఏం ? మీరు వెంటనే ఖాళీచేయాలి.

గోపి : శర్మగారూ ! ఒక్కటేమాట చెప్పమన్నారా ?

శర్మ : ఇక మా కేంలాభం లేదు. ఖాళీచేయాల్సిందే. గుప్తగారు వాళ్ళదగ్గర అడ్వాన్సుకూడా పుచ్చుకున్నారు.

గోపి : మీరు బ్రోకరేజీ పుచ్చుకోలేదూ?

శర్మ : అది మీ కెందుకు?

గోపి : ఇందులో దాపరికం ఏముందిలెండి, శర్మగారూ! సిగ్గు పడక్కర్లేదు. బాగా దబ్బిగ్గా జరుగుతున్న వ్యాపారమేగా? కనీసం ఒక్కనెల అద్దెన్నా మీ జేబులో పడందే మీ రింత గట్టిగా మాట్లాడతారా అసలు

శర్మ ; అవును! తీసుకున్నా! మీ కెందుకూ? వెంటనే ఖాళీ చేయండి.

గోపి : వీల్లేదండీ.

శర్మ : ఏమిటీ?

గోపి : ఖాళీచేయటానికి వీల్లేదు.

శర్మ : నువ్వు కుర్రాడివి, నీ కెందు కిదంతా? మీ అన్నయ్యతో చెప్పు.

గోపి : చెప్పేదేమీ లేదు. ఖాళీచెయ్యటానికి వీల్లేదు; అంతే.

శర్మ ? అంతేనా ?

గోపీ : అంతే; ఎవరితో చెప్పకుంటారో చెప్పకోండి.

శర్మ : గుప్తాగారితో పేచీలుపడటం అంత మంచిది కాదు.

గోపి ; ఏంఫర్వాలేదు. ఆయన్ను రమ్మనండి. మాట్లాడుతాం.

శర్మ : ఈ దొరగారితో మాట్లాడ్డానికాయన వస్తాడయ్యా!

గోపి : ఊఁ— ఆ దొరగారు చెప్తే మేం ఖాళీచేస్తామయ్యా!.

శర్మ : ఏమిటి నీ దౌర్జన్యం ఆయ నింట్లో వుండి?

గోపి : ఆఁ—ఆయనిల్లు. అద్దె యిస్తున్నాం. ధర్మంగా కాదు.

శర్మ : శ్రుతిమించిందే!

గోపి : మీ డబ్బుకక్కుర్తి మించలా?

ఇల్లాలు : గోపీ ఎందుకు మనకంత మాటలు? వూరుకో— రాదూ!

గోపి : ఏం ఫర్వాలా! ఏంటాయన తల తీసేది?

శర్మ : ఊఁ—సరే, చూస్తారుగా? (వెళ్ళాడు)

ఇల్లాలు : ఏమిటి గోపీ! తగవులు కొని తెచ్చుకుంటున్నావ్?

గోపి : ఈ వెధవా మనలాంటివాడే. వాడి మోచేతినీళ్ళ కాశపడి వాడి కిదంతా వీడే నేర్పిస్తాడు.

(వాకిట్లో బిచ్చగాడు)

మేడల్లో కులికినా,
గుడిసెల్లో కుమిలినా,
కట్టెల్లో ఒకలాగె కాలిపోవాలి!
బూదిలో ఒకటిగా కలిసిపోవాలి.
ఉన్న నాలుగునాళ్ళు వుబ్బిపోబోకురా!
కన్నుతెలియనిరీతి గర్వపడబోకురా!

గోపి: ఇదీ వేదాంతం! ఆ కోటీశ్వరుడి చెవుల్లో ఇల్లు కట్టుకొని చెప్పరా బాబూ; మాకెందుకీ వేదాంతం.

బిచ్చ: బాబూ! ఆకలి! మాడిపోతుండా!

గోపి: ఆహారశాఖా మంత్రి నడుగు.

బిచ్చ: బాబూ! మారాజులు.

గోపి: ఏడ్చినట్టుంది. నీ కళ్ళకు మేం మారాజుల్లా అగుపిస్తు నాౝం. వెళ్ళు, వెళ్ళు.

బిచ్చ: బాబూ కాఫీ అన్నా త్రాగుతా – అణా యివ్వండి బాబూ!

ఇల్లాలు: అయ్యో విడ్డూరమా! చూచావా; వాడు బిచ్చం అడగడం? కాఫీ తాగడానికి అణా కావాలట!

గోపి: ఏం?

ఇల్లాలు: ఇంకానయం, తాగటానికని అడగలా వాడి ధర్మం! ఒకవైపు కడుపు కాలుతుంటే యీకుంకలకి కాఫీ కావాలి? అందు కడుక్కు తినడమా? బాగుంది!

గోపి: ఏం వదినా! వాడు కాఫీతాగరాదేం?

ఇల్లాలు: వాడి బతుక్కి కాఫీయే తక్కువైందేం? మహామహా మనమే ఒకపూట తాగితే తాగుతాం, లేకుంటే లేదు! అయినా బిచ్చమడగడంలో ఆ దర్జా యేంటి?

గోపి: ఓహో అదా? మనం మాత్రం మన తాహతుకు మించిన బ్రతుకు బ్రతకొచ్చు. అందుకోసం అడుక్కు తిన

లేక అప్పులు చెయ్యొచ్చు. ఏ మహారాజునో చూచి వాడిలా బ్రతకాలని వుబలాటపడి, లేనిపోని డాంబికాలు, దర్జాలు, నటించొచ్చు, అలవాట్లు చేసుకోవచ్చు! వాడు మాత్రం కాఫీ తాగరాదేం?

ఇల్లాలు: వుంటే ఎవరు తాగొద్దన్నారు?

గోపి: మనముండే చేస్తున్నామా యీ పనులన్నీ? మనం వుండేనా ఒకడు సంపాయిస్తుంటే ఇందరు కూర్చొని తినడం? మనకు జరుగు బాటుండేనా మనం కాఫీలు తాగడం, చదవటం, సినిమాల కెళ్ళటం? మనకన్నా వాడు చాలా నయం. యథార్థం చెప్పాడు కాఫీ తాగాలని వుందని. మనం వట్టి మోసం చేస్తాం ప్రెస్టేజి అనే బురఖాతో.

ఇల్లాలు: సరేలే నాయనా! నీతో ఎవరు వాదిస్తారు. అన్నిటికీ ఎడ్డె మంటే తెడ్డె మంటావ్.

(బయటనుంచీ అమ్మా - అమ్మా - అని అరుపు)

గోపి: అదెవరు?

ఇల్లాలు: పాల మనిషిలా వుంది.

గోపి: వచ్చినట్టుంది. ఇప్పుడా పాలు తీసుకురావడం?

ఇల్లాలు: డబ్బుకోసం వచ్చినట్లుంది.

పాల: అమ్మా: ఎన్నా అమ్మా!

ఇల్లాలు: వారింట్లో లేరు. రేపు...

పాల : అదే మమ్మా! ఎన్నిరోజులుగాదా చెప్తా రీ మాదిరి? మీకుదా నాయమూ చెప్పండి! ఒకమాసం, రెండుమాసం! మొదలు తేదీ కూడా వూడ్చింది.

ఇల్లాలు : సరేనమ్మా! ఏం చేస్తాం? రేపు తప్పకుండా...

పాల : ఏం రేపమ్మా! ఆయ నెప్పుడుదా యింటో వుంటురు?

ఇల్లాలు : నీకెందుకు? రేపు నువ్వొవచ్చేటప్పటికి తీసి వుంచు తాగా.

పాల : ఏమి రేపో! రేపు, రేపని నెలలుదా గడిచి పోయింది. మాకూ బిడ్డలు పాపలు వుంటురు. అద్దామీరు గమనం వుంచుకోవాలె. మారాజులు! మీరుదా యిట్టచేస్తే ఎట్టా?

గోపి : ఏడ్చినట్టుంది! నీకూ మేం మారాజులమే!

బిచ్చు : బాబూ! మా రాజులు.

గోపి : మళ్లా చూడు, మారాజులు!

పాల : పేదవాళ్ళం. మమ్మలిష్టట్టా తిప్పితేదా మీకేం మంచి గాదు.

బిచ్చు : బాబూ! పేదోణ్ణి.

గోపి : వెళ్ళు వెళ్ళు? నీక్కాదు చెప్పటం?

బిచ్చు : బాబూ! కలిగినోళ్లు.

గోపి : అఘోరించినట్టుంది. వెళ్ళు. వెళ్ళవేం! యింకా చూస్తూ నిలబడతావు. నీక్కూదా చెప్పటం! మరిలా?

బిచ్చు: ఓయమ్మో! చెయ్యికన్నా నోరే పెద్దదిగావుంది నాతండ్రి.

పాల: ఇదిగోనమ్మా! ఇన్నాళ్ళుగాదా చూస్తిని. రేపివ్వ కుంటే మర్యాదవుండదు. అఁఅఁ– (వెళ్ళింది)

గోపి: (ఒక్క క్షణం ఆలోచించి) ఏమమ్మా! పాలమనిషీ–

ఇల్లాలు: ఎందుకు దానితో కూడా తగూ పెట్టుకుంటావా?

గోపి: కాదు. నిజం చెప్తాను.

ఇల్లాలు: ఏమని?

గోపి: రానీ – చెప్తాగా!

పాల: ఏమండీ–?

గోపి, ఇదిగో! నేను నిజం చెప్తావిను. నీకు కష్టంగావున్నా సరే. రేపుగీపు అంతా వట్టిది. నీకిప్పట్లో డబ్బురాదు.

ఇల్లాలు; (ఇదేమిటని బిత్తరపోయింది)

పాల: అదేన్నాంగో – మొద త్రేదీకూడా పోయింది. ఇంకా కాదంటే!

గోపి: మొద త్రేదీ మొద త్రేదీనేంఅయిపోయుంది. వున్నవిషయం చెప్తున్నా. నువ్వు నాలుక పీక్కున్నా, గొంతు చించుకున్నా లాభంలేదు.

పాల: ఇదేనయ్యా మర్యాదె? పాలుతాగినప్పుడులే ఆ బుద్ధి. ఏన్నాంగో – చదువుకున్న వాళ్ళు! పెద్దవాళ్లు!

గోపి: నువ్వు లక్షణిట్టు! చదువుకున్నందువల్లే మాకీ అగ చాట్లు. లేకుంటే నీలా మేమూ నాలుగు బర్రెలు పెట్టుకొని పాలమ్ముకోమూ?

పాల: బలే బాగాదా మాట్లాడుతావ్! ఆయనాఫీసు ఎక్కడో చెప్పయ్యా, పోయి తగులుకుంటాం.

గోపి: నువ్వు సత్యాగ్రహం చేసినా లేనిదాన్నికేంచేస్తాడు?

పాల; అయితే – నా మాల్దానా?

గోపి: కాదు. చచ్చేలోగా యిస్తాం; తప్పకుండా!

పాల: నిండా బాగావుంది. ఇదేన్నా మర్యాదెయ్యా! బిడ్డలకుదా పాలు కోరుతారు, పాపం, అనిపోస్తిమి. ఇట్టా యెగేస్తారనుకుంటే సుక్క పోస్తుమూ! మళ్ళా అంతా సదువుకున్న వాళ్ళుదా! కాపీలు తాగుతురు, కాపీలు (అంటూవెళ్ళింది)

ఇల్లాలు: ఏమిటి బాబూ! ఏమిటీపని?

గోపి: ఏం చేశానొదినా? సత్యం చెప్పాను.

ఇల్లాలు: ఏం సత్యమో సత్యం! మరీ యింత తొందరైతే ఎలా చెప్పు? పెద్దవాన్ని నే నున్నానే. నే నా మాత్రం చెప్పలేకేనా వూరుకుంది. చెప్పు. ముందూ వెనక లేమన్నా ఆలోచించావా గోపీ?

గోపి: మరేం చేయమన్నావ్వొదినా! ఎన్నిరోజులని దాన్నిలా దగా చేస్తుంటాం? ఎన్నిరోజులని దాంచేత ఆమాటలనిపించుకుంటాం?

ఇల్లాలు : అలాగని పిల్లల్ని ... పసికందుల్ని, పస్తుపెట్టి చంపుతానంటావా ?

గోపి : వదినా ?

ఇల్లాలు : రేపు వాడు పాలుతీసుకురాడు. పిల్లలగతి ఏంకావాలో ఆలోచించావా ? ఆ పసికూనకు పాలేం చేయాలి? అసలే రోగిష్టులు ! పాలుకూడా లేకుంటే వాళ్ళేంకావాలి? నువ్వూ నేనైతే సరే. నోరులేని పిల్లల్ని సత్యం సత్యమని పస్తులు మాడ్చి చంపుతానంటావా ?

గోపి : వదినా ! బుద్ధి గడ్డితింది !

ఇల్లాలు : కాదు. నీకు పిచ్చెత్తూంది !

గోపి : (ఏడుస్తూ) వదినా !

ఇల్లాలు : ఎందుకు నాయనా ఏడుస్తావు ? వూరుకో.

గోపి : (పరుపులో ముఖం దాచుకొని) చచ్చిపోతే –

ఇల్లాలు : సరేలే. చచ్చిపోతే! చచ్చిపోతే! మంచిపాట...ది, అన్నాతమ్ములకు!

గోపి : రేపు పిల్లలకు పాలు లేదు. నీకు మందు తీసిచ్చే గతి లేదు. ఒక్కపూట మంచి తిండిలేదు. అప్పులూ – రోగాలూ – చచ్చిపోతే – (బయట వురుములు, మెరుపులు)

ఇల్లాలు : వూరుకోవూ? నువ్వలా ఏడుస్తుంటే నాకు మతిపోతుంది.

గోపి: చచ్చేలోపుగానన్నా తీరుస్తామా యీ అప్పులు? ఒక్కరోజన్నా హాయిగా నిద్రపోతామా? లేదొదినా; లేదు. మన బ్రతుకు లింతే...

ఇల్లాలు: ఏడిస్తే తీరుతుందా?

గోపి: చస్తే తీరుతుంది.

ఇల్లాలు: (వళ్లు జలదరించి) వర్షం వస్తూంది.

గోపి: పాపాయి — చూడొదినా. పాపం ఒంటరిగా పడు కున్నాడు; భయ పడతా డీ ఉరుములకి — వెళ్ళి తీసుకురా — నే... నా న్నను తీసుకొస్తా. (ఇద్దరూ వెళ్ళారు)

(గాలి, వర్షం జల్లూ, యింట్లోకి కొడ్తూంది; ఒక్కక్షణం)

గోపి: (వచ్చాడు) నాన్నకు జల్లుకొట్టడం లేదులే, వర్షం వెలవనీ పిల్లల్ని తీసుకొస్తువుగాని.

గోపి: (పైకిచూచి) ఈ కొంపకు కారడం కూడా!

ఇల్లాలు: (ఒకపాత్రి తీసుకొచ్చి కురుస్తున్న చోట పెట్టింది)

గోపి: ఆ తలుపులు వేసే వొదినా; జల్లు కొడ్తూంది.

ఇల్లాలు: (తలుపులు వేసింది.)

గోపి: రాత్రికి మనచావు కుక్కలచావు ఆ కసాయివాడి కేం? వసారా కూడా ఖాళీ చేయమంటాడు. (కూలబడి కప్పుకేసి చూస్తూన్నాడు. తలుపు చప్పుడు. సీత తలుపు తీసింది. రంగనాథం తడిసి ప్రవేశించాడు)

ఇల్లాలు : అబ్బ ! ముద్దగా తడిసి పోయారే – వర్షం వెలిసేంత వరకూ కాస్త ఆగి రాకూడదూ? (టవలిచ్చి) తుడుచుకోండి.
(పంచ వెతుకుతూంది. రంగనాథం గోడకు నిలబడ్డాడు. గోపీ లేచాడు. రంగనాథం రెండడుగులు వేశాడు. అడుగులు తడబడ్డాయి. గోపి గమనించాడు.)

గోపి : ఏమిటన్నయ్యా ? ఏంటి అలాగున్నావ్ ?

ఇల్లాలు : జ్వరం వచ్చిందా ?

గోపి : ఏ మన్నయ్యా – పలకవేం ! ఏమిటది ?

రంగ : ఏమీ లేదు. వూరికే.

ఇల్లాలు : వేరేబట్టలు వేసుకోండి. పూర్తిగా తడిసిపోయారు.

రంగ : నేను తడిస్తే మీకేం ? (కోటులోపలిజేబు చూచుకొని) అవి తడిసిపో లేదు. భద్రంగానే ఉన్నాయి. భద్రంగానే తెచ్చాను.

గోపి : ఏమిటవి ?

రంగ : (తడబడుతూ ద్వారంకేసి వెళ్ళి) రా ! తీసుకురా ! లోపలికి తీసుకురా ! అవి తడవ లేదుగా ?

(ఒక కుర్రాడు బట్టలమూట తెచ్చి లోపల పెట్టి వెళ్ళాడు)

గోపి : ఎవరి కివన్నీ ?

రంగ : మీ కే !

గోపి : కొన్నావా ?

రంగ : ... ... ...

గోపి : వదినా ! నీకు కావలసినన్ని చీరలు, పిల్లలకు చొక్కా గుడ్డలుకూడా.

ఇల్లాలు : (సంతోషంగా వాటిని చూస్తూ) చాలాకొన్నారే—అందుకే యీరోజు వర్షం దంచేస్తూంది!

గోపి : అప్పుచేసి పప్పుభోజనం కాదుకదన్నయ్యా !

రంగ : హు—అప్పు... అప్పుకాదు. అంతకన్నా ఘోరం — అయిపోయింది — అదికాస్తా అయిపోయింది. ఇక నేనూ అందరిలాగే తలవంచుకొని నడవాల్సిందే! ఇక నేనూ ఆ శెట్టియార్లకు సలాములు కొట్టాల్సిందే. ఇక నేనూ న్యాయాన్ని పెట్టెలోపెట్టి తాళం వెయ్యాల్సిందే — ఇక నేనూ పైసాపాటకు ఆడాల్సిందే. అయిపోయింది. (కుంగిపోయాడు)

ఇల్లాలు : ఏమిటండీ అది ?

గోపి : అన్నయ్యా ! అన్నయ్యా !!

రంగ : కడుపుమాడి చస్తున్నా నైతికబలంతో గొమ్ములు విరుచుకొని బ్రతికాను. ఇక బ్రతకలేను; చావాలేను. కాదు — బ్రతికీ చచ్చినట్టే!

గోపి : అన్నయ్యా ! ఏంజరిగింది ?

రంగ : గడ్డితిన్నానోయ్. గడ్డి! ఇదిగో. (జేబులో డబ్బు వాళ్ళ మీద విసిరి) సంతోషించండి. హాయిగా వుండండి. పెళ్ళిళ్ళు చేసుకుంటారో, కట్నాలిస్తారో — చదువుకుంటారో — ఏం

చేస్తారో చేయండి. నా నీతిని అమ్ముకున్నా నేను గడించ గలిగిందింతే. తీసుకోండి. లంచం! నీతిని అమ్మి తెచ్చిన బిచ్చం!!

గోపి: అన్నయ్యా (కాళ్ళమీద వాలి) అన్నయ్యా! పస్తులుంటాం - చస్తాం-చిరిగిన పేలికలతో బతుకుతాం-నువ్వు... ను వ్వీపనెందుకు చేశావన్నయ్యా? మాకు సంతోషమని చేశావా? నీ అంతరాత్మను చంపితే మా కానంద మనుకున్నావా? అన్నయ్యా!

రంగ: ఇది మీ తప్పుకాదు... నా తప్పూకాదు. పూర్తి! అయిపోయింది ఒక్క విషబిందువు రక్తంలో ప్రవేశించింది. ఇక ఏడ్చి ఏంలాభం?... పూర్తి!

గోపి: వద్దన్నయ్యా! ఈ సొమ్ము మన కొద్దు. ఇచ్చేస్తా. నే వెళ్ళి తిప్పిచ్చేస్తా. చెప్పన్నయ్యా! (గుడ్డలమూట తీసుకున్నాడు.)

రంగ: గోపీ... ఆగు.

గోపి: ఎవరివో చెప్పన్నయ్యా - నామీద ఒట్టు! చెప్పు! ఈ బట్ట లెవరివి?

రంగ: దయాళ్ సేట్‌వి?

గోపి: ఈ డబ్బు?

రంగ: అదింక తిప్పివ్వలేం. మన చెయ్యి మించిపోయింది.

గోపి: ఏం?

రంగ : ఆద్దొచ్చినదారి మాన కగమ్యగోచరం.

గోపి : ఓ. అయితే - అయితే - (నోట్లు పెద్దలమాట తీసుకొని పోతున్నాడు.)

రంగ : గోపీ! గోపీ!!

(తలుపు తెరిచేప్పటికి జల్లు జివ్వుమని కొట్టింది. ఆగాడు. ప్రకృతి ఆ కుటుంబ నైతిక పతనానికి సాయపడింది.)

# 2 వ రంగం

## మరుసటి రోజు

(ఆ ంతా ము ను ప టి రం గ మే)

[సీత ఏదో ఇంటిపని చూచు కొంటూంది. గోపి రెండు బరువైన సంచులు తెచ్చి, కిందపెట్టి, మంచం వాల్చి కూర్చొని]

గోపి : వదినా!

ఇల్లాలు : అవన్నీ ఏమిటి ?

గోపి : చెప్తాగా. అదిసరేగాని వదినా! నువ్వేదో 'ఫస్టుఫారం దాకా' చదివావు కదూ!

ఇల్లాలు : సగే; నాచదువు చట్టుబండలైందిలే!

గోపి : అందుకా్కదు, భూమి దేనిచుట్టూ తిరుగుతూంది ? చెప్పుచూద్దాం.

ఇల్లాలు : భూమి సూర్యుని చుట్టూ తిరుగుతూం దంటారు.

గోపి : వట్టి అబద్ధం. పచ్చి అబద్ధం వోదినా !

ఇల్లాలు ; అదేమో నాయనా ! నాకేం తెలుసు? ఎవరు చూచొచ్చారు; నిజం ?

గోపి : నేను చూచాను. భూమి అంటే ఈ ప్రపంచం, సూర్యుడి చుట్టూ తిరగటంలేదు.

ఇల్లాలు : మరిదేని చుట్టూ తిరుగుతోంది ?

గోపి : పైసాచుట్టూ తిరుగుతూంది. తెలిసిందా ? కనుక ఆ పైసా మనచేతుల్లో వుంటే ఈ భూమి, అంటే యీ ప్రపంచం, అంటే యీ ప్రపంచంలో వున్న మనుష్యులూ, మృగాలు, వస్తువులూ, అన్నీ మనచుట్టూ తిరుగుతాయి. ఇదీ సిసలైన కల్తీలేని సత్యం.

ఇల్లాలు : చాలా కష్టపడే కనిపెట్టావు సత్యాన్ని.

గోపి : కనిపెట్టడం వేరు. వుపయోగించడం వేరు. ఈ రోజు నుంచీ నేను యీ పరమ సత్యాన్ని అమల్లో పెట్టి ఆచరించ బోతున్నా.

ఇల్లాలు . మంచిదే.

గోపి : మంచిదే అంటే లాభంలేదు. అందుకు నీసహాయం చాలా అవసరం.

ఇల్లాలు : బాగుంది. నన్నేం చెయ్యమన్నావ్ ?

గోపి : నీవు ఇల్లు కదలక్కర్లేదు. వేళానుగా పెద్ద ప్లాను.

ఇల్లాలు : ఏమిటో చెప్పరాదూ!

గోపి : అది తరువాత చెప్తాలే. ముందు ఈ మినప్పప్పు నుంచి దేకేటూ చూడు.

ఇల్లాలు : ఇంత మినప్పప్పు ఏంచేసుకోను? పప్పులేదంటే ఎవరైనా ఇంత మినప్పప్పు తెచ్చివేస్తారా గోపీ?

గోపి : అదంతా యెందుకు? బాగుందా? మంచిపప్పేనా? చెప్పు.

ఇల్లాలు : పప్పు మంచిదే! అయితేమాత్రం?

గోపి : సరే! తీసివుంచు.

ఇల్లాలు . బాగుంది. ఆ సంచిలో ఏంటి?

గోపి : తొందరపడితే ఎలా?... ఇదిగో చూడు. (అని సంచి కుమ్మరించగా పండ్లపొడి పొట్లాలూ చిల్లరసామాన్లూ ఉన్నాయి.)

ఇల్లాలు . ఆ పొట్లాలేంటి?

గోపి : పళ్లపొడి పొట్లాలు.

ఇల్లాలు : అయ్యో రామా! ఇదేమిటి గోపీ? నీకేమన్నా పిచ్చెక్కుతూందా? ఆ డబ్బుతీసుకెళ్ళి యీ పళ్ళపొడి పొట్లాలు మినప్పప్పు పట్టుకొచ్చావే - ఏంచేసుకోను? డబ్బిలా తగలేస్తే ఎలాచెప్పు. ఏమి టీపని? మీ అన్నయ్య ఆ డబ్బు ఒక్క పైసా తీసుకురావడానికెంత బాధపడుతున్నారో నువ్వు చూస్తూనేవున్నావుగా! మీ అన్నయ్య చూస్తే...

గోపి : తిప్పడతాడు, తంతాడు! అంతేనా?

ఇల్లాలు: అయినా యిదేం పని చెప్పు; కాలేజీ జీతమున్నా కట్టకుండా?

గోపి: అంతకన్నా మంచిపనే చేశానొదినా.

ఇల్లాలు: ఏమిటో నీ విపరీతపు చేష్టలూ నీవూనూ. మీ అన్నయ్యచూస్తే నిన్నూ నన్నూ బతకనివ్వరు బాబూ. వెళ్లు. నా మాట విను. అవి అన్నీ తిప్పిచ్చేసిరా. ఎందు కనవసరంగా ఆయనచేత మాట లనిపించుకుంటావ్. ఆయ నకు వాళ్ళు తెలియని కోపంవస్తుంది. వెళ్లుబాబూ! వెళ్ళు.

గోపి: ఎందు కొదినా అలా గాభరాపడతావ్? నువ్వేమీ భయపడకు. నే నున్నానుగా అన్నయ్యకు అంతా నచ్చ జెపుతా.

ఇల్లాలు: నచ్చచెప్పటం మాట దేవు డెరుగు. కాని, చచ్చేట్టు దెబ్బలు తింటావు. (బైట కారు హారన్ శబ్దం, "గోపీ", అని కేక.)

గోపి: ఆఁ - వస్తున్నారా!

ఇల్లాలు: ఎవరది?

గోపి: రాత్రి నన్ను కొట్టాడే ఆ కుర్రాడు.

ఇల్లాలు: మళ్ళీ ఏముఖంపెట్టుకొచ్చా డిక్కడికి!

గోపి: రాత్రి తాగివున్నాడులే వొదినా?

ఇల్లాలు: తాగాడూ! అంత చిన్న కుర్రాడే?

గోపి: తాగుడుకు చిన్నా పెద్దావుం దేంటి?

ఇల్లాలు: తాగుడు తీసేశారన్నారుగా!

గోపి : పబ్లిగ్గా. బ్లాక్ మార్కెట్టులో బాగా దొరుకుతూంది.

ఇల్లాలు : దానికీ బ్లాక్ మార్కెట్టే !

గోపి : ఈ రోజుల్లో మంగలి షాపుల్లో కూడా బ్లాకుమార్కెట్టుంది.

ఇల్లాలు : అయినా ఆ తాగుబోతుతో నీకేం చెప్పు.

గోపి : తాగితే ఏం వదినా ? తప్పా ?

ఇల్లాలు : బాగుంది. మీ అన్నయ్యతో అను; యీ మాట.

గోపి : పిచ్చి వదినా! వాడికి డబ్బుంది. తాగుతాడు. మనదేం పోయింది ? మతిలేక తాగుడు తీసేశారు గానీ – నేనైతే ప్రతి లక్షాధికారికీ కొంతకోటా ఏర్పరచి తప్పక తాగాలని రూల్ పెట్టే వాణ్ణి.

ఇల్లాలు : చాలా మంచిపనే. నీవు తాగవుగదా ?

గోపి : అదికా దొదినా ! వాళ్లు గనుక తాగకపోతే ఆ డబ్బు ఖర్చయ్యేదెట్లా ? అలా లక్షలు లక్షలు యినప్పెట్టెల్లో మూలుగుతుంటాయి; యింకోళ్ల కంటబడకుండా. అసలీ డబ్బు గలాళ్ళని బాగా తాగించాలి. అప్పటి కన్నా వాళ్ల డబ్బు నలుగురిచేతుల్లో కొస్తుందేమో. (మరల కారు హారన్) ఆఁ. వస్తున్నానురా. ఇదిగో వదినా నే నిప్పుడే వస్తాగాని ఆ పప్పంతా అప్పడాలు చేసిపెట్టు.

ఇల్లాలు : అప్పడాలా ?

గోపి : ఆఁ.

ఇల్లాలు : ఎందుకూ ?

గోపి : కావాలి. నేవు సాయంత్రానికల్లా కనీసం రెండువేల అప్పడాలం కావాలి.

ఇల్లాలు : రెండువేల అప్పడాలే.

గోపి : అవును. వుందిగా ప్లాను. చెప్తా. (అంటూ వెళ్ళాడు)

ఇల్లాలు (ఆలా ముక్కుమీద వేలువేసుకొని ఒక క్షణం ఆగి, తరువాత పండ్లపొడిపొట్లాలు సంచిలో వేస్తుండగా రంగనాథం చరచరా వచ్చి కోటుతీసి మంచంమీద విసిరివేసి)

రంగ : ఏమిటవి ? •

ఇల్లాలు : (జంకుతూ) ఏమీ లేదు.

రంగ : ఏమీ లేదంటావేం ? నాకళ్ళు పోయాయా ?

ఇల్లాలు : ఎందుకండీ అట్లా కోప్పడుతారు ? ఈమ కాసికే కళ్ళు పోవాలా ?

రంగ : మరి ఏమీ లేదంటావేం ?

ఇల్లాలు : ఇంటికిరావడం రావడం యిట్లా మండిపడుతూ వస్తారు అదేం నాకర్మ !

రంగ : నీకర్మకాదు. నా తలరాత.

ఇల్లాలు : పోని టూరు హాయిగావుంటే ఆ ఆఫీసులోనే వుండిపో రాదూ !

రంగ : ఆఫీసులోనన్నా నన్ను హాయిగా వుండనిస్తారుట మీరు? వెధవపూరాక! నాకు దాపరించారు. చాలురా దేవుడా

ఈ సంసారం. "జై సీతారాం" అని నెత్తిన గుడ్డ వేసుక పోతే బాగుండును.

ఇల్లాలు : అంతకష్టం ఏమొచ్చిందండీ యిప్పుడు? నేనేగా మీకు శని. పోనీండి. నేను చస్తాను. మీరన్నా హాయిగా వుండండి.

రంగ : మీకందరికన్నా ముందు నేనే చచ్చేటట్లున్నా. లేకుంటే పాలమనిషి యింటికివస్తే జవాబు చెప్పిపంపే యోగ్యత లా? ఆఫీసుకు తరుముతారూ? నేనేమన్నా వుద్యోగం చేయాలనా? నలుగురిలో తలెత్తుకొని తిరగాలని మీకు వుందా అని. పోతేపోతాడనేగా? దరిద్రపు మూక!

ఇల్లాలు : దాన్నెవరు తరిమారండీ ఆఫీసుకి? నిన్నరాత్రి మీరు వెళ్ళిన వెంటనే వచ్చింది. ఉదయం పాలు కూడా తీసుకరాలేదు. వచ్చి వుంటే డబ్బు యిచ్చేసేవాళ్ళం.

రంగ : పోనీ సవ్యంగా జవాబు చెప్పారూ దానికి? చచ్చే లోపుగా యిస్తామన్నారటగా అప్పంతా! ఇంట్లో కూర్చొని తిని, మదం పట్టిన మాటలేగా ఇవి (విసురుగా నడిచాడు. కాలికి సంచి తగిలి పప్పు క్రింద పోయింది) వెధవ కొంప! కాలి కన్నా అడ్డాలే; ఛీ. ఛీ. క్షణం సంతోషం లేదుగా యీబతుక్కి (పప్పుచూచి) ఈ పప్పెక్కడిది?

ఇల్లాలు : కొన్నదే.

రంగ : ఇంత పప్పుకొన్నారూ!

ఇల్లాలు : ఆఁ!

రంగ : మీ కేమన్నా మతివుందా? ఇవేంటి (పొట్లాలు తీసిచూచి) ఈ పండ్లపొడి పొట్లాలెందుకు ?

ఇల్లాలు : ఎందుకో మీ తమ్ముడు కొని తెచ్చాడు.

రంగ : నేను నానాగడ్డితిని, తీసుకొచ్చివేస్తే మీ రిలా తగ లేస్తారేమిటే? ఈ మినపప్పు, పండ్లపొడి పొట్లాలు వాడు కొని తేవడమేంటి? నువ్వా దాన్ని తీసి వుంచడమేంటే? మీరు నన్ను బతక నివ్వదలుచు కున్నారాలేదా? చెప్పండే, ఆ మాటకొస్తా. ఏ నుయ్యో గొయ్యో చూచుకొంటా.

ఇల్లాలు : ఎందుకండీ అంత ఆఘాయిత్యం ?

రంగ : అఘాయిత్యమంటావు మళ్లా (చెయ్యెత్తి కొట్టబోయాడు కాని ఆగాడు.) దరిద్రపుమూక ... నా కర్మంకాలి నాకే దాపు రించాలీ. (ఇల్లాలికి కళ్ళనీళ్లు తిరిగాయి. పైటతో తుడుచుకుంది.)

ఈ దొరగా రెక్కడికి దయచేశారు ?

ఇల్లాలు : ఏమో ఎవరితోనో స్నేహితులతో వెళ్ళారు.

రంగ : ఆ ఎర్రటి కుర్రాడేనా ?

ఇల్లాలు : ఆఁ.

రంగ : కార్లోవచ్చాడా ?

ఇల్లాలు : ఆఁ.

రంగ: ఆ తాగుబోతు వెధవతో వీడికి స్నేహం. వీడేమో చదివి వృద్ధిస్తాడని నాచావు నేను చస్తున్నా.

("రంగనాథం" అని బైట కేక)

రంగ: (విసురుగా) ఎవరూ?

డాక్టరు: (వచ్చి) నేనురా! ఏమిటా ఇద్దరమ్మ ఇద్దరూ యీ రోజు మహా కొంపలో వున్నారు?

రంగ: మా వాడగుపించాడా నీకు?

డాక్టరు: ఆఁ. చాలాసేపయింది లే కనుపించి. అదేమిటో వాడిచేత ఏదో వ్యాపారం పెట్టించినట్టుంది నువ్వు?

రంగ: ఏం వ్యాపారం?

డాక్టరు: బస్సు స్టాండ్ల దగ్గర పండ్లపొడి పొట్లా లమ్ము తున్నాడే.

రంగ: మా వాడే? గోపీ?

డాక్టరు: అవున్నా.

రంగ: నువ్వు సరిగ్గా చూచావా?

డాక్టరు: చూడ్డమేంటి! మాట్లాడితే.

రంగ: నీకు బుద్ధిలేదురా!

డాక్టరు: అయింకేం! నన్నే అన్నావు ఆమాట?

రంగ: మరి మాట్లాడానంటావే; ఎముకలు విరగదన్నక.

డాక్టరు: ఎవన్ని? వాడినే!

రంగ : ఏం ?

డాక్టరు : ఎందుకొచ్చిందిలే వాడిజోలికి వెళ్ళడం! మందలించే వాణ్ణేకాని...నువ్వే ఆ వ్యాపారంపెట్టించావేమో ననుకున్నా.

రంగ : ఊఁ. అనుకున్నావ్ ? అవున్నా అవును. మేమంటే అంత తేలికై పోయాం నీకు.

డాక్టరు : నేనేమన్నానని ?

రంగ : ఎంత వెధవబతుకు బతుకుతున్నా బస్టాండులవద్ద పళ్ళుపాడి పాట్లాలమ్మేగతి పట్టలేదులే; నీ దయవల్ల.

డాక్టరు : పూర్కే తమాషాగా అన్నదాన్ని నువ్వింత సీరియస్‌గా తీసుకుంటావనుకోలేదురా !

రంగ : తమాషాకేముంది. యధార్థం అంతే! ఏడబ్బుగల వారో కట్టెలు మోసుకొస్తే "సింప్లిసిటీ" అంటారు. అదే మాబోటివాళ్ళయితే గతిలేకంటారు. అంతేగా?

డాక్టరు : సత్యం చెప్పావ్. నువ్విలా ఫీలవుతావో లేదో చూద్దామనే అన్నా; నామటుకు మన కెంత చెడ్డా కొంత "ప్రెస్టేజ"ంటూ ఏడ్చింది. నీ "కో" క్లార్కులే చూస్తారనుకో అప్పుడు నీ "ప్రెస్టేజే"ంకావాలి? అది కాస్తఆలోచించి ఆ గోపీని మందలించమని చెప్పటానికే వచ్చా. వేరే విధంగా అనుకుంటావా ?

రంగ : ఎబ్బే!

డాక్టరు: మరి నేవస్తా. (వెళ్ళాడు)

గోపి: (ఎదురుగా వచ్చాడు. చేతిలో ఒక ప్యాకెట్టుంది.)

డాక్టరు: ఏం గోపీ! పళ్ళపొడి వ్యాపారంలో ఏమాత్రం లాభం?

గోపి: ఆఁ – నేనూ ఒక పదివేలు గడించిన రోజు అందరూ "ఛీ"మంటారు లేండి. డాక్టరుగారూ!

డాక్టరు: రైట్, రైట్! (వెళ్ళాడు)

రంగ: (మౌనంగా కూర్చున్నాడు సమాధానం వింటూ)

గోపి: (ప్యాకెట్టలా పెట్టి, చొక్కా విప్పుతున్నాడు)

రంగ: ఎక్కడికెళ్ళావురా?

గోపి: ఎక్కడికీ లేదు.

రంగ: ఎక్కడికీ లేదంటే – యిక్కడే వున్నావా? నాకళ్ళేం పోయాయా?

గోపి: ఓ స్నేహితుడితో అట్లా వెళ్ళి వచ్చానన్నయ్యా.

రంగ: ఎవరా స్నేహితుడు?

గోపి: నీకు తెలియదన్నయ్యా.

రంగ: నాకందరూ తెలుసు చెప్పవోయ్.

గోపి: శేఖరని.....

రంగ: ఆ తాగుబోతు వెధవేనా?

గోపి: (ఏమిచెప్పాలో తోచక చివరికి) అవును.

రంగ: అవునంటావంటూ సిగ్గులేకుండా.

గోపి: వాడు తాగితే నాకు సిగ్గులేకపోవటమేమిటి?

రంగ: కాక మరేంటి? వాడి వెనకాల నువ్వెందుకు వెళ్ళావురా? బుడ్డీ లందివ్వటానికా? ఎవరినైనా కొట్టడానికా?

గోపి: నేనా పనులు చేయలేదింతవరకు. కాని ఆపనులు చేస్తూన్న "పోకిళ్ళు" పెద్దవాళ్ళందరూ నవనాగరిక సంఘంలో గౌరవనీయులుగానే వున్నారు.

రంగ: (కొన్నేంతదూరం వెళ్ళి, ఆగి) కాలేజీజీతం కట్టావ్?

గోపి: లేదు.

రంగ: ఇంటిఅద్దె యిచ్చావూ?

గోపి: లేదు.

రంగ: నేనెప్పుడు నీకు డబ్బిచ్చింది?

గోపి: రాత్రి.

రంగ: ఎందుకిచ్చానోయ్?

గోపి: ఆ రెండుపనులకు.

రంగ: మరెందుకు చేయలేదు?

గోపి: మనమంచికే!

రంగ: ఓహో! మనమంచికే చేశావన్నమాట. మహాత్ములంతా వృద్ధిరంచాలని చేశావు.

గోపి : వీలయితే - అనుకూలిస్తే - వృద్ధిరిద్దామనే.

రంగ : ఊఁ హూఁ -! అంతపెద్దవాడివయ్యావ్ ? ఇంకేం ? ఈనాటికి నాకు మాటకు మాట బదులుచెప్పేవాడివయ్యావ్. సరే!

గోపి : నాతప్పు ఏమీ లేదు, గనుక చెప్తున్నా.

రంగ : ముయ్‌నోరు ! ఇంకా మాట్లాడుతున్నాడు. తప్పేమీ లేదట, లేదూ! మా బతుకులు కాస్తా నడివీధుల్లో వేస్తూ!

గోపి : నే నేంచేశాను ?

రంగ : ఏం జేశావ్? బస్ స్టాపుల్లో పళ్ళుపాడిపాట్లాలన్నా లేదూ?

గోపి : అవును.

రంగ : అవును ? ఇంకా జవాబు చెప్తాడూ! సిగ్గులా ? మర్యాదలా? ఛీ! వెధవ బతుకు. ఇంటింటికి అడుక్కుతిన లేకపోయావ్ ?

గోపి : నేను చేసిందంత నీచమైనపని అని నాకు తెలియదు.

రంగ : తెలియదూ ? జవాబుచెప్పటానికి తెలుసూ ? అసలు కాలేజీజీతం ఎందుకు కట్టలేదోయ్?

గోపి : నా కిష్టంలేదు.

రంగ : ఏమిటిష్టంలేదు ?

గోపి : ఆకాలేజీ చదువు.

రంగ : అది చేరకముందే ఏడవలేకపోయావ్ ?

గోపి: అప్పుడు తెలియదు.

రంగ: ఇప్పుడు తెలిసిందా అంతకన్నా పళ్ళుపోడి అవట్రమే మంచిదని?

గోపి: అవును.

రంగ: ఆఁ! "రాస్ కెల్" (పటపట చెంపలు వాళ్ళు తెలియకుండా కొట్టాడు) మాటకు మాట చెప్తావ్. (మళ్ళీ ఒక దెబ్బ)

ఇల్లాలు: అయ్యో! అయ్యో! ఏమిటండీ పిల్లవాణ్ణలా కొడుతున్నారు. వూరుకోండి (అడ్డువచ్చింది)

రంగ: (ఆమెను విడిలించి) నువ్వే ఇంతకూ కారణం!

మున: ఒరే రంగా! ఒరే గోపీ! - ఏమిటిరా - ఏమిటిరా అది?

ఇల్లాలు: మరీ అంత ఒళ్ళుతెలియనికోపమైతే ఎలా చెప్పండి?

రంగ: మాట్లాడావంటే నీకూ పళ్ళూడతాయి!

మున: ఏమిటిరా అది? ఎందుకురా ఆ అమ్మాయి మీద అట్లా అరుస్తావ్. ఏమొచ్చిందిరా (అంటూ వచ్చాడు)

గోపి: (నాన్నను పట్టుకొని) ఏంలేదునాన్నా - నువ్వెళ్ళిపడుకో.

మున: ఎందుకురా వాడట్లా అరుస్తున్నాడు?

రంగ: చావాలేక - బతకాలేక.

ఇల్లాలు: అయ్యో! భగవంతుడా! ఇదేంటి తండ్రీ, అన్ని అగచాట్లు మా నెత్తినే వేస్తున్నావు?

ముస : అంత కష్టం ఏమొచ్చిందిరా యిప్పుడు ? ఆ యిల్లాలెన్నిందుకురా అట్లా ఏడిపిస్తావ్ ?

రంగ : చస్తే ఏడుస్తారో - ఏడవరో అని.

గోపి : అన్నయ్యా! నాన్నతో ఎందు కట్లాంటి మాటలు · నువ్వెళ్ళి పడుకోనాన్నా - ఏమీ లేదు. అన్నయ్య కొంచెం కోపంగా వున్నాడంతే.

ముస : కొట్టాడా ?

గోపి : కొడితే కొట్టాడు; అన్నయ్యేగా ! నువ్వెళ్లి పడుకో.

ముస : ఏమి టోరంగా యిది? వాణ్ణట్లా రోజుకోకసారన్నా చావబాదేస్తుంటా వెందుకురా? వాణ్ణి వాడి మేనమామ- ఇంటికైనా పంపించకపోయావా నీకంత కష్టంగావుంటే.

రంగ : నేను కొట్టిందొకటే కనుపిస్తుంది. వాడేంచేశాడో అడుగు.

ముస : ఏంచేశాడ్రా?

రంగ : ఏంచేయాల ? బజార్లో బస్స్టాపుదగ్గర పళ్ళపొడి పొట్లాలు అమ్ముతున్నాడు, సిగ్గులేకపోతే సరి !

ముస : అవునా గోపీ?

గోపి : అవున్నాన్నా.

ముస : నీకు రానురాను యివేం పాడుబుద్ధులు పుడుతున్నాయిరా ?

గోపి : పాడుబుద్ధులు కావునాన్నా – నాలుగు కాసులు గడించే బుద్ధులు.

ముస : ఏడ్చినట్టేవుంది. మనవంశంఏమిటి–మన కాహతేమిటి? చెడపుట్టావుకదరా! నీకిదేం కర్మరా? నా జీవో చాకిరీచేసి వాడగచాట్లు వాడుపడి తెచ్చివేస్తుంటే తిని చదువుకోటానికి నీకేంరా? నేను బతికుండగానే యిదెక్కడి అప్రతిష్ఠరా?

గోపి : సరేలేనాన్నా. ఇక చెయ్యనులే. నువ్వెళ్ళి పడుకో.

ముస : వాణ్ణేడిపించకురా! ఆఫీసునుంచి ఏ అర్ధరాత్రికో వస్తాడసలు. వాణ్ణికాస్త సుఖంగా వుండనీరా, ఆ నాలుగుఘడియలూ. నా మాట వినరా!

గోపి : అలాగే లే నాన్నా – నువ్వెళ్ళి పడుకో (తీసుకెళ్ళాడు)

రంగ : (చూస్తూ నిలబడి మంచంమీద కూలబడి ముఖం కప్పుకొన్నాడు)

ఇల్లాలు : (ఏమీతోచక దుఃఖాన్నాపుకొంటూంది)

గోపి : (వచ్చి) అన్నయ్య భోంచేశాడా వదినా?

ఇల్లాలు : (లేదని తలవూపి చెప్పింది)

గోపి : లే అన్నయ్యా! భోంచేద్దువుగాని.

రంగ : ... ... ...

గోపి : మరచా–యిదిగో వదినా! నీకు టానిక్. (పాంటు జేబులో నుంచి తీసిచ్చాడు)

రంగ : (కొత్త చూచాడు)

గోపి: వదినా! నీకు చీరకూడా తెచ్చా (పొట్లాంయిప్పి ఇచ్చాడు)

ఇల్లాలు: నాకెందుకు బాబూ — పిల్లలకు నాలుగు చొక్కా- గుడ్డలు తీసుకరా లేకపోయావ్; చలికి వణికిపోతున్నారు.

గోపి: నీకు చాలా చీరలున్నాయా? ఆ ఒక్క చీరెంతో ఎన్నాళ్లు గడుపుతావ్. పిల్లలకు రేపు తెద్దాంలే.

ఇల్లాలు: ఊఁ. నీకెట్లాగో గడుపుకు రా — పిల్లలు...

గోపి: పిల్లలు ఏడుస్తున్నారు. చూడొదినా!

ఇల్లాలు: ఊఁ (వెళ్ళింది)

గోపి: (అన్నయ్యను తాపీగాచూచి) భోజనానికి లే అన్నయ్యా!

రంగ: ... ... ...

గోపి: నేచేసింది తప్పే. అనవసరంగా వదిన్ని బాధపెట్టు న్నాను; ఉదయం ఎప్పుడో తిన్నది

రంగ: నీకు నిజంగా చదవాలని లేదేంరా?

గోపి: ఇప్పుడు మళ్ళా ఎందుకా గొడవ? భోంచేసి మరీ మాట్లాడుకుందాం.

రంగ: ఫర్వాలేదు లే నిజం చెప్పు.

గోపి: చదవాలని లేకపోవడం కాదన్నయ్యా! ఎలా చదవ మంటావ్ చెప్పు. నిన్ను యిన్ని అగచాట్లుపెడుతూ ఎం దుకు చెప్పు యీ చదువు. నాకు మతిపోతుందన్నయ్యా! నా వుద్దేశ్యం ఒకటే అన్నయ్యా! చదివి విజ్ఞానం గడించ

డం మానవుడైనవాడికి అవసరమే. కాని అంతకన్నా బ్రతకడం ముఖ్యం. సంసారం నానాటికీ నరకమైపోతూంది. ఏ వ్యాపారమన్నా చేసి నాలుకాసులు తెచ్చి వేస్తే యీ సంసారాన్ని కాస్త సుఖంగా లాగ్గలమేమోననే నా ఆశ. అంతకన్న వేరేంలేదు.

రంగ : అలాగని పళ్ళుపొడి పొట్లాలమ్మే ఖర్మేంటిరా మనకు.

గోపి : అందులో తప్పేంటన్నయ్యా! పెట్టుబడికి డబ్బేవుంటే గౌరవమనుకునే పెద్ద వ్యాపారమే చేసేవాణ్ణి. ఈ యమ యాతనకంటే యింటింటికీ తీసికెళ్ళి అప్పడాలమ్మడం మేలని పిస్తుందన్నయ్యా! నా బాధ నువ్వు గ్రహిస్తావనుకుంటా.

రంగ : ఆఁ –

గోపి : మనం పస్తులున్నా పడివుండాలిగాని యిలాంటి పనులు మాత్రం చేయకూడదు; అంతేనా అన్నయ్యా! ఇదేగా మన ప్రెస్టేజీ! పిల్లలా రోగాలతో కుళ్ళిపోతూండొచ్చు. వాళ్ళకు రెండుచొక్కాలన్నా లేకపోవచ్చు. అప్పుల వాళ్ళు నానాబూతులు తిట్టొచ్చు. ఈ మురుక్కాలవ కంపులో – ఈ కొంపషెడ్‌లో బతకొచ్చు. జీవితంలో సుఖమనేది ఏ కోశానా లేకపోవచ్చు – ఈ లా చింతతో తిండిలేక విశ్రాంతిలేక పనిచేసి, చివికిచావొచ్చు. నీతిని అమ్ముకోవచ్చు.

రంగ : గోపీ!

ఇల్లాలు : (వస్తుంది)

గోపి : కూలివాళ్ళు మనకంటే నయం. వాళ్ళు నలుగురుంటే నలుగురూ పనిచేస్తారు, తెస్తారు, తింటారు, లేదా పస్తుంటారు. మన మలా కాదు; ఒక్కడు సంపాయించాలి [illegible]నగరం బతకాలి. అడది యిల్లు వదలిపెట్టకూడదు. ఇంటి పనితప్ప వేరింకేం చెయ్యకూడదు. తెల్లచొక్కా లెయ్యాలి. మంచిచీరెలు కట్టాలి. ఆ డబ్బుగలవాళ్ళలో మనుష్యుల మనిపించుకోవాలి. అంతేనా?

రంగ : చాల్లేవోయ్! (చరచరా వెళ్తున్నాడు)

గోపి : (అడ్డువెళ్ళి) నన్ను చంపుకు తిన్నట్టున్నయ్యా... భోంచేసి వెళ్లు.

రంగ : (చేయి పైకెత్తాడు, కాని వేగం తగ్గింది. గోపీ లెంప తాకి చూచాడు)

గోపి : పెద్దగా దెబ్బ తగల్లేదులే అన్నయ్యా!

రంగ (ఆగలేక తప్పించుకొని చరచరా వెళ్లాడు)

గోపి : అన్నయ్యా! అన్నయ్యా! (తిరిగిచూడకుండా రంగనాథం వెళ్ళాడు)

ఇల్లాలు : (కంగారుతో) ఏమిటి బాబూ అది? వెళ్ళు బాబూ వెళ్ళు. ఆయన్ను తీసుకురా గోపీ! నాతండ్రివి కదూ! వెళ్లు. ఆయన కోపం వచ్చినా దుఃఖం వచ్చినా అంతే! వెళ్ళు బాబూ. నాకేమో భయమేస్తోంది. నా బాబువి కదూ!

గోపి : ఎందుకొదినా భయం?

ఇల్లాలు : ఈ రోజుల్లా ఒక్కటే చావు జపం చేస్తున్నారు; మాటంటే చస్తాం చస్తా మని. ఈ దీంట్లో ఆయనేం చేసుకుంటారో బాబూ (అని వెక్కి వెక్కి ఏడుస్తూంది)

గోపి : వదినా ... వదినా! వూర్కో! అన్నయ్యేం చేసుకోడు. చచ్చిపోవడమంటే అంత సులభమా ? వూర్కో వదినా.

ఇల్లాలు : అయ్యయ్యో ! అయ్యయ్యో ! (అని తల మంచంకోడు కేసి బాదుకొంటుంది)

గోపి : వదినా ! వదినా ఏమిటిది? (ఏమీ చేయలేక తలపట్టుకొన్నాడు)

ఇల్లాలు : (చర్రున లేచి వెళ్ళింది)

గోపి : వదినా ఎక్కడికి? (వాకిలి దాకా వెళ్ళి, నిట్టూర్చి రెండుసార్లటూ యిటూ తిరిగి దేవునిపటం కనబడగా పారేసేంత విసురుగా తీసి మళ్ళీ ఏం తోచిందో అక్కడే పెట్టాడు)

గుప్త : (ఇంతలో బయటనుండి) ఎవ్వరయ్యా యింట్లో ?

గోపి : మనుష్యులు.

గుప్త : ఆఁహాఁ! మనుష్యులేనా ?

గోపి : ఆఁ. ఓటర్ల లిస్టులో పరుగెత్తుకొచ్చేటప్పుడు ఏమనుకున్నారు ?

గుప్త : ఏమోయ్, శర్మా! ఈయన ఓటు యిస్తేనే కదా మనం గెల్చింది ?

గోపి : లేదు, లేదు! మీ జాతకాల్లో వ్రాసుంది గెల్చారు.

గుప్త: సరే. శర్మా... అడుగు. నిలబడతావేం ?

శర్మ: మీ అన్నయ్య లేడూ ?

గోపి: లేడు.

శర్మ: ఇంటి అద్దె యిచ్చి వెళ్ళాడా ?

గోపి: లేదు.

శర్మ: లేదంటే ?

గోపి: లేదనే.

శర్మ: ఇచ్చి వెళ్ళలేదనా ? అసల్లేదనా ?

గోపి: రెండూ లేదు.

శర్మ: చూచారండీ జవాబులు ?

గోపి: జవాబులు చూట్ట మేమిటయ్యా ? వినాలిగాని ! సరే ! నేనడిగినవాటికి జవాబులు చెప్పండి.

శర్మ: నువ్వడిగినవాటికి మేం చెప్పడమేంటి ?

గోపి: నువ్వడిగినవాటికి మేంచెప్పడమేంటి ?

గుప్త: ఏం అబ్బాయ్! బలే దబాయిస్తున్నావే! ఆఁ. హూ! ఏఁటి నువ్వడిగేది ? ఏదీ ? (ఈ మాటలంటూ ఒకాయన లోనికి వచ్చాడు. ఆ సన్నపాటి ద్వారంలో ఆయన అవస్థపడి రావడం చూచి గోపీ పక. పక నవ్వాడు.)

గుప్త: ఏమయ్యా అట్లా నవ్వుతావు?

గోపి: ఆఁ – ఏమీ లేదు, గుప్తాగారూ! మీ బ్లాక్ మార్కెట్ బొజ్జను చూచి. (పరిహాస నవ్వాడు)

గుప్త: (చాలా కోపంతో) ఇదుగో... మీరు వెంటనే ఖాళీచేయకపోతే...

గోపి: పోలీసుల్ని పిలిపిస్తారు అంతేనా? అది సరేగాని గుప్తాగారూ! మేమీ యింట్లో చేరేటప్పుడు మీరేం చెప్పారు?

గుప్త: ఏం చెప్పాం? అద్దె మొదటితారీఖున తప్పకుండా యిచ్చితీరాలన్నాం.

గోపి: అంతేనా? ఎలెక్ట్రిక్ లైట్లు వేయిస్తామనలా?

శర్మ: ఎలెక్ట్రిక్ లైట్లూ... ?

గోపి: అన్నారా లేదా? ఆన్సర్ టు ది పాయింట్.

గుప్త: అన్నామయ్యా!

గోపి: కుళాయి బాగుచేయిస్తా మన్నారా లేదా?

గుప్త: అన్నాం.

గోపి: ఆ ముసుక్కాలవ మూయిస్తామన్నారా? ఈ ద్వారానికి కమ్మీల తలుపులు పెట్టిస్తామన్నారా? ఈ వాగ్దానా లన్నీ ఎన్నికల వాగ్దానాలై పోయాయేం? (శర్మ గుప్తా లొకరినొకరు చూచుకున్నారు)

గోపి : పలుకరేం ? ఈ కుళాయి నీ ళ్ళొకసారి తాగిచూడండి.

గుప్త : అది... అది కార్పొరేషన్నడుగు !

గోపి : అక్కడా మీరేకదయ్యా దాపురిస్తారు ! పదవులన్నీ మీవో లేకపోతే మీ బంధువులవో – మీ సానుభూతి పరులవో ఇక ఎక్కడికెళితే ఏంలాభం ?

గుప్త : ఇదిగో అబ్బాయ్ ! ఒక్కటేమాట చెప్తున్నా. మీ కిష్టంవుంటే వుండండి, లేదా ఖాళీచెయ్యండి. అంతే –

గోపి : బావుంది. మీరక్కనక యిండియా ప్రధానమంత్రి పదవిస్తే, మీ పరిపాలన ఈ యింటి పరిపాలనలాగే వుండి, ప్రజలందరూ ఏడిస్తే మీ కిష్టముంటే వుండండి, లేకుంటే యిండియానే ఖాళీచెయ్యండని చెప్తారా ప్రజలకు ?

శర్మ : ప్రజలు !

గుప్త. ప్రజలు ! ప్రజలు ! మహానేర్చారు లేవయ్యా యీ మొగిలిముక్కలు ! కాసుచేయని వెధవలంతా యిదేకూత. బుర్రలేని వెధవలంతా ప్రజలు.

గోపి : ఆమాట నాతో అంటే అన్నారుకానీ పబ్లిగ్గా మాత్రం అనకండి.

గుప్త : ఏం ? అనలందామా స్తే మేమంతా ఎవరం? ప్రజలం కామూ ? కడుపుచేతపట్టుకొని, చదువూ సంధ్యా లేకుండా గొర్రెలమందల్లా గోడల్లా బ్రతుకుతూండే కుంకలేనా ప్రజలు ? మేం ప్రజలం కామూ ?

గోపి: కారు. మీరు ప్రజలు కారు. మీరు మనుష్యులు కారు. ఆ గొర్రెల మందల్ని దోపిడి చేసుకుంటూండే తోడేళ్ళు. ఆ గొడ్లతో బండచాకిరీ చేయించుకొని పొట్ట నింపుకొంటూన్న సోమరిపోతులు. వాళ్ళ అజ్ఞానంమీద వ్యాపారం చేస్తూన్న రాక్షసులు, మృగాలు, దొంగలు!

గుప్త: అరే (కర్ర విసిరాడు. గోపీకి బాగా దెబ్బ తగిలింది.)

శర్మ: అం — పదశర్మా — పద — పోలీసుస్టేషన్‌కు పద. (గుప్త ముందుగా వెళ్ళాడు.)

ఇల్లాలు: (ఇల్లాలు వచ్చింది. గోపీ రక్తం తుడుచుకొంటున్నాడు. చూచి కెవ్వుమని కేకేసింది.)

గోపి: వదినా ఏమిటది ?

ఇల్లాలు: నెత్తురు... నెత్తురే ? అయ్యోబాబూ! ఎవరుకొట్టారు?

గోపి: ఎవరూ కొట్టలేదు, ఏంలేదు! గుప్తాగారొచ్చారు. ఆయన చేతికర్ర తిప్పుతూంటే తగిలింది; అంతే.

ఇల్లాలు: జానెడింట్లో మూరెడు కర్ర అని, యీ యింట్లోకి వచ్చి ఆయన కర్ర తిప్పడమేంటి ? చూడు, పెద్దగాయమేందేమో — ఆస్పత్రికన్నా వెళ్లు.

గోపి: గుప్తాగారు తన బంగ్లా అనుకున్నారులే వదినా!

ఇల్లాలు; ఎందుకొచ్చింది ? డబ్బుందే — యిచ్చేరాదూ ?

గోపి : ఇచ్చేవాణ్ణేకాని – ఏమిటీ న్యాయం? తాను చెప్పింది ఒక్కటీ చేయకుండా అడ్డమైనవన్నీ చేస్తాడు; నేను తప్పేం మాట్లాడేనే?

ఇల్లాలు: ఏమో బాబూ! ఈ రోజు జన్నీ దెబ్బలు – తిట్లు – గోలగా వుంది. నాకేమో భయమేస్తోంది. ఆయనెక్కడికెళ్లారో ఏమో!

గోపి : అలా బీచికి వెళ్లుంటాడులే వాడినా!

ఇల్లాలు : బీచికే! బాబూ! నువ్వొన్నా కాస్త వెళ్ళిచూచిరా. నా కెందుకో సముద్రం మాటంటే గుభేలు మంటుంది. మొన్న కూడా ఎవరో... వెళ్ళు బాబూ – నా బాబువికదూ.

గోపి : ఇట్లో మువ్వాక్కరైనా వుండగలవా?

ఇల్లాలు : నాకేమొచ్చింది? రోజూ వుండటంలా?

గోపి : అదికాదు. ఈరోజు నాకోసం పోలీసులొస్తే రావచ్చు

ఇల్లాలు : పోలీసులే! నీ కోసమే?

గోపి : నువ్వేం భయపడకు. ఇంట్లో లేనని చెప్పు. ఇల్లంతా తనిఖీ చేసుకుంటే చేసుకోనీ. పూరుకో. ఇంతలో నేనూ వచ్చేస్తాను. సరేనా!

ఇల్లాలు : అలాగే – నువ్వెళ్ళిరా బాబు. (గోపీ వెళ్ళాడు)

ఇల్లాలు : (చాలా కంగారుపడి ఏంచెయ్యాలో తోచక కాళ్ళూ, చేతులు వణుకుతుండగా వాకిలితలుపులు వేసింది. ఇటువైపు తలుపులుకూడా వేసి, దేవుని పటంముందు నిలబడి) స్వామీ! భగవంతుడా! రక్షించు.

(వాకిట తలుపుతట్టిన శబ్దం. సీత ఉలిక్కిపడి నఖశిఖపర్యంతం వణికి పోతూ వుంది. మళ్లీ తలుపు శబ్దం)

ఇల్లాలు : (ఇంకా భయంతో) పోలీస్-(అని కేకవేసింది)

(బయటనుంచి "సీతా సీతా" అని కేక. తెప్పరిల్లి తలుపుతీయగా రంగనాథం వచ్చాడు) వచ్చారా?

రంగ : పోలీస్ అని కేకేశావేం? ఎందుకలా వణికిపో తున్నావ్? ఆ ముచ్చెమట లేమిటి?

ఇల్లాలు : ఏం లేదులెండి.

రంగ : వీ డెక్కడ?

ఇల్లాలు : మీకోసం వెళ్లాడు.

రంగ : ఇంతవరకు యిక్కడే వున్నాడా?

ఇల్లాలు : ఇక్కడే వున్నాడే!

రంగ : మరి వూళ్లో యీ పుకారేంటి? ఎవరినోట చూచినా వీడిమాటగానే వుందే!

ఇల్లాలు : ఏమని?

రంగ : ఈ ఇల్లుగలాయన - గుప్తాను - వీడు కొట్టాడట. పెద్ద గాయం తగిలిందట. ఆయన్ను కారులో వేసుకొని పోలీస్ స్టేషన్‌కు తీసుకెళ్ళారట.

ఇల్లాలు : అయ్యో అన్యాయమా! అయ్యో అన్యాయమా! ఇదేం కాలమండీ?

రంగ : ఏం?

ఇల్లాలు : గుప్తాగార్ని మనవాడు కొట్టాడా? వాళ్ళనోళ్ళుపడి పోను. తెలిసే అంటున్నారా? అయ్యో; కాకిమూక!

రంగ : ఏమిటీ నీ అఘాయిత్యం?

ఇల్లాలు : మరేమిటండీ? ఆయనే మనవాడితల చిల్లిపడేటట్టు కొట్టి... పైగా యీ అఘాయిత్య మేమిటండీ!

రంగ : గుప్త ఇక్కడికొచ్చాడా?

ఇల్లాలు : వచ్చాడు. పోనీ ఆ కూడావచ్చిన శర్మనడక్కూడ దటండీ?

రంగ : శర్మా! వాడు పైసాయిస్తే ఏ గడ్డిఅయినా తింటాడు.

ఇల్లాలు : బ్రాహ్మణపుటకపుట్టాడుకదండీ... మళ్ళీ! న్యాయం అన్యాయం లే? దేవుడు లా?

రంగ : దేవుడు! అదిగో దేవుడు! అడుగు... సాక్ష్యంచెప్తాడేమో! (దేవునిపటం చూపాడు)

ఇల్లాలు : అయితే యిక మన గతేంకావాలండీ? గోపీని పోలీసులు పట్టుకుపోతారా? వాళ్ళన్నా న్యాయంచూడరా? మీరైనా వెళ్ళి చెప్పండి; పాపం. యింకా నుంచున్నా రేంటి.

రంగ : ఎవరికెళ్ళి చెప్పమన్నావ్.?

ఇల్లాలు : ఆ పోలీసులకు.

రంగ : మనం ముందుగా వెళ్ళి చెప్పుకోవడం దేనికి? రానీ. అందరం వెళ్దాం. నేనూ వెళ్తాను. జైలులో హాయిగా...

ఇదిగో తీసుకో! (అని కొన్ని నోట్లు యిచ్చాడు. కాని సీత జంకుతూంది తీసుకోటానికి) తీసుకో! జంకుతావేం తీసుకోటానికి? నేను పోయినా మీరన్నా హాయిగా ఉండండి! సంతోషంగా బ్రతకండి! పూర్తిగా తడిస్తే చలి వుండదు! తలకుమించిన శిక్షా వుండదు, తీసుకో!

ఇల్లాలు: ఇదీ లంచం డబ్బేనా?

రంగ: అవును.

ఇల్లాలు: అక్కర్లేదు.

రంగ: ఏం?

ఇల్లాలు: మావల్ల కాదు—నావల్ల మీారు (వెక్కి వెక్కి ఏడుస్తూంది)

రంగ: ఏడవకు! ఏడ్చిలాభం లేదు. సీతా! సీతా!

ఇల్లాలు: ఆఁ!

రంగ: ఇటుచూడు. నామాట విను. ఇందులో ఎవరి తప్పూ లేదు. ఎవరి పాపమూ లేదు. తిండికి లేనివాడు దొంగతనం చేస్తాడు. కడుపుమాడే ఆడది సాని అవుతుంది. నేనూ అంతే.

ఇల్లాలు: నన్ను చంపేయండి.

రంగ: చంపాను. ఇన్నిరోజులూ చంపాను. నినొక్క రోజన్నా సుఖపెట్టలేను. ఇన్నాళ్ళు చేసిన పాపం చాలు. కట్టుకున్న భార్యను, కన్నపిల్లల్ని కడుపు మాడ్చేకంటే మహాపాపం కాదులే... సీతా; లంచం తీసుకోవటం. ఎవరికి పాపం? ఏది పాపం?

ఇల్లాలు : తెలిస్తే జైల్లో వేస్తారట ?

రంగ : ఎవరు చెప్పారు ?

ఇల్లాలు : గోపీ.

రంగ : వేస్తే వేస్తారు. జైల్లో రేషన్ తెచ్చుకోవలసిన గొడవ లేదు. వేళకు తిండి లేదనే చింత లేదు. ఇక్కడి కంటే అక్కడే నయం.

ఇల్లాలు : మీకొక్కరికి—

రంగ : మిమ్మల్నీ జైల్లో వేస్తే అక్కడే కాపురం పెట్టొచ్చు. జైలుగదులు యీ అద్దెకొంపలకన్నా బాగానే వుంటాయి.

ఇల్లాలు : నామాట వినండి. ఈ పాపిష్టిసొమ్ము మనకక్కర్లేదు. ఇచ్చేయండి.

రంగ : పాపం ! పిచ్చిదానా ! కోర్టులు, పోలీసులు నిర్ణయించేదంతా న్యాయమనుకున్నావా ? అయిపోయింది. ఇక నాక్కావలసిందేముంది. ఎటూ చెడ్డాను. బాగా చెడతాను. నా సంసారం సంతోషంగా బ్రతకడానికి చెడ్తాను. నాపిల్లలు జబ్బులతో చావకుండా వుండటానికి పాపం చేస్తాను! జైలుకుపోతాను! అవమానాలుభరిస్తాను! చస్తాను! నాక్కావలసింది డబ్బు – డబ్బు – డబ్బు..! (కూలబడ్డాడు) సీతా ...ఆ కొత్తచీరకట్టుకో – ఒక్కసారి. యిన్నాళ్లకొక్క సారి! అట్లా నవ్వుతూ నిలబడు. మళ్ళా ఎన్నాళ్ళకో—? రేపేమౌతుందో ? రా సీతా ! పిల్లలకు కొత్తచొక్కాలు తొడుగు – సాయంత్రం సినిమాకు వెళ్దాం. ఏం?

(డాక్టరు గబగబా వచ్చాడు. సీత వెళ్ళలేక వెళ్ళింది)

డాక్టరు: రంగా! రంగా!

రంగ: ఏం?

డాక్టరు: చూచావా? గోపీ ఏంచేసాడో?

రంగ: ఏంచేశాడు?

డాక్టరు: బాపూజీ పార్కు దగ్గర ఆహారసమస్యను గురించి యం. యల్. ఎ. ఎవరో మీటింగు పెడితే అక్కడికి వెళ్ళాడు.

రంగ: వెళ్ళి...?

డాక్టరు: వెళ్ళినవాడు వూరుకున్నాడా? ఆయన మాట్లాడినంతసేపు వెధవ అడ్డుదిడ్డపు ప్రశ్నలు వేశాడు.

రంగ: ఊఁ.

డాక్టరు: అంతటితో వూరుకోక అమాంతం లేచి రౌడీ వెధవలాగు, ప్లాటుఫారంమీదికెళ్ళి నానా కారుకూతలుకూశాడు.

రంగ: ఎవర్ని?

డాక్టరు: ఎవర్ని? యింకెవరున్నారు? ప్రభుత్వాన్ని, మంత్రివర్గాన్ని! "మినిస్టర్" అంటే సరిగ్గా స్పెల్లింగన్నా తెలియని యీ వెధవలంతా ప్లాటుఫారంయెక్కి మంత్రులను విమర్శించటం! వీడి తాహతేమిటి? వీడి రాజకీయ జ్ఞానం ఏమిటి? వీడే నా విమర్శించవలసినవాడు? ఏమిటంటా ఆ వెధవ వాగుడు?

రంగ : ఏంచూశాడు ?

డాక్టరు : ఒకటా, రెండా ? ఆ కూతల కర్థంలా ? అందరూ అమాంతం మహారాజులై బంగళాల్లోవుండాలని కోరితే మంత్రులు కాదు బ్రహ్మదేవుడుమాత్రం ఏంజేస్తాడు? ఇదేం పరిపాల ననుకున్నాడా, పప్పుదప్పళమనుకున్నాడా ? అఁ— పూఁ—అంటే "స్వతంత్రభారతదేశంలోకూడ" అని ఏడవడం. స్వాతంత్ర్యం వచ్చేస్తే ఆరోజే అందరికి డబ్బుల సంచులు పంచిపెట్తామని చెప్పారా మనవాళ్లు ? ఏమిటంటా ఆ వెధవవాగుడంతా ? వీడికి తిండీగుడ్డా లేకపోతే మంత్రులా ? వీడికి కాలేజీలో సీటు దొరక్కపోతే మంత్రులా ? ఏ వెధవలో బ్లాక్‌మార్కెట్ చేస్తుంటే దాని కీ మంత్రులే ? వెధవవాగుడు !

రంగ : ఇంత మాట్లాడితే అయనేం అనలా ?

డాక్టరు : అఁ! వీడి మాటలు లక్ష్యపెట్టి జవాబుకూడా చెప్తాడు ? ఇలాంటి కుక్కలెన్నో మొరుగుతుంటాయి ! అందులో ఆయన గాంధీజీ ప్రియశిష్యుడు, అహింసావాదవడంవల్ల వూరుకున్నాడు ! అదే నేనైతేనా (ఈ మాటలంటూండగా ముసలాయన మెల్లగా వచ్చి కూర్చున్నాడు)

రంగ : లాగి గెంటే లేకపోయావు వాణ్ణి !

డాక్టరు : కాకుంటే వాళ్ళుమాత్రం ఏంజేస్తారా! పాపం యెన్ననిచూస్తారు ? మొన్న ప్రొహిబిషన్ పెట్టారా ? బస్సులు నేషనలైజ్ చేశారా ! లేడీకండక్టర్సును పెట్టారా ?

హైదరాబాద్ యుద్ధం ప్రకటించి గెలుచారా? జమీందారీబిల్లును గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నారా! బ్లాకు మార్కెట్టును నశింపజేసే బిల్లునుగురించి తికమకలు పడుతున్నారా? కంట్రోళ్ళను తీసేశారా; మళ్ళీ పెడుతున్నారా... ఎన్నని చేస్తాట్టా? ఊపిరితిరక్క చస్తుంటే! నిన్నా నీ తమ్ముణ్ణి కాస్సేపు కూర్చోపెడితేసరి ఆ కుర్చీలో; మహా చేసేవాళ్ళు. ఆ వచ్చేవాళ్ళకు జవాబు చెప్పలేక చచ్చేవాళ్ళు! వూరికే వాగితే సరా?

రంగ: (నాన్నతో) విన్నారా? మీ వాడి ప్రతాపం?

మున: ఏమిటిరా?

రంగ: ఆ గోపీగాడే! కొంపకు అగ్గితెచ్చాడు. నా వుద్యోగానికే నీళ్ళుతెచ్చాడు. పదండి! ఇంకేం! అందరూ పదండి. అందరం ఏకంగా ఏ సముద్రమో చూచుకుందాం.

మున: ఏమిట్రా అది? ఏమొచ్చిందిరా?

రంగ: మీ కుమారరత్నం దేశాన్నంతా వుద్ధరించాలని బయలుదేరాడు. నా కొంపకూల్చాడు.

మున: ఏంచేశాడ్రా?

రంగ: ఏముంది? మీటింగులో మంత్రులమీద ప్రభుత్వంమీద నానా కారుకూతలు కూశాడట!

మున: అవునా?

డాక్టరు: అవునండీ!

ముస: అయ్యో! వాడికేమొచ్చిందిరా పాడుబుద్ధి?

రంగ: ఇంట్లోతిని పడుండలేక — మదంపట్టి, పొగరెక్కి! ఇంత కూస్తే వూరుకున్నాడురా? కాల్చి అవతలపారేలా?

డాక్టరు: కాల్చిపారేస్తే ఎంతో నయం కదూ!

ముస: ఇప్పుడు వీడెక్కడ్రా?

రంగ: ఇంకా యెక్కడ వుపన్యాసాలిస్తున్నాడో! (గోపీ వచ్చాడు. సీత యిటువైపునుంచి వచ్చింది) అయిందట్రా వుపన్యాసాలు? నన్నెందుకురా యిట్టా చంపుకుతింటావ్? ఈ వుద్యోగమున్నా వుండటం నీ కిష్టంలేదురా? ముష్టెత్తుకొని బతకాలనివుందా? ఆ పిల్లలుబతకడం నీ కిష్టంలేదేం? చెప్పరా!

గోపి: ఏమిటన్నయ్యా?

ముస: ప్రభుత్వం — మంత్రివర్గం అవి ఎలాపోతే నీకెందుకురా? ప్రపంచాన్నంతా వుద్ధరించటానికి నువ్వు పుట్టావట్రా! నీ వాగుడు ఎంతదూరంపోతుందో యోచించావా? ఈ సంసారంకోసం వాడన్ని విధాలా చివికిచస్తూండటం చూస్తూకూడా యిదేంపనిరా గోపీ!

గోపి: నాన్నా! అన్నయ్యా! ఏంటిది? ఏంచేశాను?

రంగ: ఏంచేశానంటావట్రా యింకా? (దుఃఖం కోపం కలుస్తూ వచ్చాయి. చెయ్యెత్తాడు. కాని, ఆ చేత్తోనే తలబాదుకొని) నా ఖర్మ! నా గ్రహచారం. ("రంగనాథం గారూ" అన్న కేకతో పాటు పోలీసు సబిన్స్పెక్టరు, కానిస్టేబుల్ వచ్చారు. డాక్టరు రంగనాథం గోపీ ముసలాయన ఒక్కసారే "పోలీస్" అన్నారు)

ఇల్లాలు : పోలీసే!

ఎస్. ఐ.: ఆ! పోలీస్ నేనేకనపట్టంలా? రంగనాథం నువ్వేనా?

రంగ: అవును.

ఎస్. ఐ.: మీ యిల్లు తనిఖీ చెయ్యాలి!

రంగ: మా యిల్లా?

ఎస్. ఐ.: ఆఁ. మీ యిల్లే! వెయ్ సోదా చెయ్యి. గోపీ నీ తమ్ముడేనా?

గోపి: అవును.

ఎస్. ఐ.: నిన్ను కాదు అడగటం.

గోపి: నేనే ఆయన తమ్ముణ్ణి.

ఎస్. ఐ.: నువ్వే పార్టి?

గోపి: టీ పార్టి.

రంగ: గోపీ –

ఎస్. ఐ.: ఊఁ. పరిహాసంగా వుందే?

గోపి: లేకుంటే మాకు పార్టీలేమిటండీ? ఇంట్లో రోగాలతో చాకిరీతో చస్తుంటే! అసలు దినంగడవటం కష్టంగా వుంటే మాకు పార్టీలేంటి?

ఎస్. ఐ.: ఆ మాటలే చెప్తాయి నీ వేపార్టీ అయిందీ.

గోపి: అవును. వున్నది చెప్పకోవడంకూడా పార్టీ మాటలే –

(అటకమీదవున్న కాగితాలు పోలీసు చూచి ఒక బొమ్మ తెచ్చి ఎస్. ఐ. కివ్వగా ఆయన దాన్ని పరికించి చూచి)

ఎస్. ఐ.: ఈ బొమ్మ ఎవరిది?

గోపీ: నాదే.

ఎస్. ఐ.: ఎక్కడ కొన్నావ్ ?

గోపి: కొనలా. నేనేగీచా నాబొమ్మ.

ఎస్. ఐ.: ఏమిటా బొమ్మ?

గోపి: మీా కనపట్టం లా?

ఎస్ ఐ.: చెప్పరోయ్! నీ నోటిగుండా చెప్పించాలి.

గోపి: పల్లెపడుచు.

ఎస్. ఐ. ఆవిడ నెత్తిమీాద్దేంటి?

గోపి: గడ్డిమోపు.

ఎస్. ఐ: ఆవిడ చేతిలో ఏమిటి?

గోపి: కొడవలి.

ఎస్. ఐ.: ఆవిడ చేతిలో కొడవలి పెట్టడంలో నీ అభిప్రాయం?

గోపి: పల్లెపడుచు చేతిలో కొడవలుండక, టెన్నిస్ రాకెట్టుంటుందాండీ?

ఎస్. ఐ: షటప్!

రంగ: గోపీ!

ముస: గోపీ ఏమిట్రా? ఆ కూతలు ఏమిట్రా? సార్! ఏదో కుర్రాడు తెలియక కూశాడు. మన్నించండి. నన్ను చూచన్నా...

ఎస్. ఐ: వాడు కుర్రవాడైతే యీ పెద్దమని షేంచేశాడో చూడండి. ఏయ్! ఆ కోటిలా తీసుకో.

రంగ : (ముఖాన నెత్తురు చుక్కలేదు)

ఎస్. ఐ: (పోలీసు కోటుతెచ్చి యస్. ఐ. కిచ్చాడు. కోటులో నోట్లు పైకి తీసి) ఊఁ - ఈ నోట్లెక్కడివి? నిన్నే అడగటం! ఈ డబ్బెక్కడిది?

రంగ : నాదే.

ఎస్. ఐ: నీదే. ఎక్కడ నుంచొచ్చింది?

డాక్టరు: ఏమిటండీ యిది?

ఎస్. ఐ: ఏముంది? లంచం సొమ్ము! కరెప్షన్! చూడండి కలెక్టరుగారి సంతకం.

డాక్టరు: ఉంటే?

ఎస్. ఐ: ఇది లంచం సొమ్ము. కరెప్షన్ పట్టుకోడాని కిలాంటి నోట్లు కొన్ని పంపుతున్నారు. ఏమయ్యా! ఇది లంచం సొమ్మేనా? పలకవేం?

రంగ : అవును.

ముస : లంచం! నువ్వేనట్రా! లంచం తీశావట్రా!

రంగ : అవున్నాన్నా.

ముస : అయ్యో! అయ్యో! ఇదేంఖర్మరా! ఇదేం పాడు కూడురా! మన కొంపకు రా! మన వంశంలో లేదుగదరా! కొంపకు అగ్గిపెట్టుకున్నావుగదరా! అయ్యయ్యో!

రంగ : నాన్నా ! పూర్తిగా—నాన్నా ! వచ్చి ఏంలాభం ? అయి పోయింది !

ముస : పెద్దవాణ్ణి – నాతో ఒకమాటన్నా చెప్పకూడదట్రా ఇన్నాళ్ళట్టరుగానూ ! నామాట వినండి. నేనూ గవర్నమెంటు వుద్యోగం చేశాను. ముప్ఫైసంవత్సరాలు ప్రభుత్వానికి నా శక్తంతా ధారపోశాను. చివరకు రోగం మిగుల్చు కున్నాను. మూలపడ్డాను. నే నెన్నడూ యీ పాడుకూ డెరుగను. పసితనం వాడు... వాడు... ఈ సంసారంకోసం చేశాడు. మన్నించండి... కనికరించండి.

ఎస్ ఐ. : ఏం లాభంలేదండీ ? ఇది కలెక్టరుగారి ఉత్తర్వు. ఏమయ్యా ! ఈ నేరా న్నొప్పుకుంటావా?

రంగ : ఒప్పుకుంటా. లంచంతీశా. కక్కుర్తిపడ్డా. నిజమే.నా పెళ్ళాంబిడ్డలు రెండుపూటలూ తిండితిని బ్రతికేదానికోసం యీ పని చేశాను. పాపమని తెలిసేచేశాను; మీారే చూడండి–ఈ సంసారం ఈ బ్రతుకు. లక్షాధికార్ని కావా లని చేయలేదు. నా బిడ్డలకు పాలకూ్కడా గతిలేకుంటే చేశాను. 80 రూపాయల జీతంతో బతకలేక చేశాను. 30 రూపాయలు ఇంటిఅద్దె కిచ్చి యింకెలా బతకమంటారు? ఆ పసికూనలు అలా రోగాలతో కుళ్ళిచస్తూంటే ఎలా చూస్తూ కూర్చోమంటారు ? నా హృదయం ఓర్వలేక పోయింది. నా ఓర్పు సహించలేకపోయింది. వాళ్ళను కన్నాను. నా కన్నకడుపు పూర్తిగా లేకపోయింది. ఏంచెయ్య

మంటారు? మీరేంచేస్తారో చెయ్యండి; నేను సిద్ధంగానే వున్నాను.

ఎస్. ఐ. : లంచంతీయడం నేరమనీ శిక్షిస్తారనీ, తెలిసేచేశావా?

రంగ : అవును.

గోపి : నేరం! పెద్దలూ, అధికారంకలవాళ్ళు వేలకువేలు లంచంతీస్తే గప్‌చిప్; అది నేరంకాదు. అది బయటికే రాదు. వాకిట కాపలాకాచేవాడు కడుపుమాడి కాసుకు చేయిజాస్తే అది నేరం! అది లంచం! దానికే శిక్ష!

ఎస్. ఐ. : షెయ్! షటప్!

రంగ : గోపీ! నువ్వూర్కో. అది లాభంలేదు. తప్పుజేశాం. ఒప్పుకుంటాం, జైలుకు తీసుకుపోతారా పోనీ! పోదాం! అంతకన్నా చేసేదేమీలేదు ఎస్. ఐ.గారు! ఇక మీయిష్టం

ఎస్. ఐ. : మిమ్మల్నిద్దర్నీ అరెస్టుజేశాం కదలండి

ఇల్లాలు : ఇద్దర్నీ అరస్టే? అరస్టే?

రంగ : గోపీనికూడా? గోపీని అరస్టే!

డాక్టరు : గోపీ ఏంచేశాడండీ? అతన్నెందుకు అరెస్టు?

ఎస్. ఐ. : ఎందుకంటే...గుప్తాగార్ని కొట్టినందుకు! పబ్లిక్ మీటింగులో అరాచకాన్ని రెచ్చకొట్టే వుపన్యాసం యిచ్చినందుకు! దేశశాంతి భద్రలు కాపాడ్డానికి అతన్ని అరెస్టు చేస్తున్నాం.

రంగ : సరే... పదండి.

ఇల్లాలు : మమ్మల్ని — ఆ పసికందుల్ని — నన్ను కూడా తీసుకెళ్లండి. మీతోపాటు వుంటాం. మీరెక్కడుంటే అక్కడే
(రంగనాథం కాళ్ళమీద పడింది.)

రంగ : సీతా! పూర్ణా! మిమ్మల్ని తీసుకెళ్ళడం నాచేతుల్లో వుందా. ప్రభుత్వం దయ తలిస్తేగా!

ఇల్లాలు : అయితే (లేచి, యస్. ఐ. దగ్గర కెళ్ళి) కనికరించండి... నన్ను చూచనన్నా కనికరించండి. నా వల్లనే ఆయన ఆ పాపం చేశారు. నన్ను పోషించడానికి, నా పిల్లల్ని పెంచటానికి! ఆయన అలాంటివారు కారు. ఎన్నడూ అలా చేయ్యనూ చెయ్యలేదు. నా మాట నమ్మండి. మీకా డబ్బంతా యిచ్చేస్తాం! ఇదిగో... అంతా తీసుకోండి. ఇంకా కావలిస్తే నాపుస్తే... అన్నీ... అన్నీ... కనికరించండి!

ఎస్. ఐ. : ఇస్! పూర్ణా-వమ్మా! ఏం లాభంలేదు. ఇది ప్రజా ప్రభుత్వం. స్వరాజ్యం వచ్చింతరువాత మనవాళ్లు లంచగొండితనాన్ని అణచి వేస్తున్నారు.

ఇల్లాలు : మీకు హృదయంలేదూ? మీకు నాలాంటి అక్క-చెల్లెళ్ళు లేరూ? మీకు బిడ్డలూ పాపలూ లేరూ? ఆ పసికందుల్ని చూడండి! ఈసుంతా యిక పస్తులుపడి చావాల్సిందేనా? ఇదేనా స్వరాజ్యం?

గోపి : అవును. అదే స్వరాజ్యం. చాలకపోతే లంచం తీశాం. తిండికి లేకుంటే లంచం తీశాం. ఏదీ... మీ ప్రజాప్రభుత్వ పరిపాలకులను బ్రతకమనండి 80రూపాయలతో, తెలుస్తుంది.

ఇల్లాలు : మీరు మనుష్యులేనా ?

ఎస్. ఐ. : ఏయ్! (చెయ్యెత్తాడు)

గోపి : ఏయ్. కబడ్దార్! ఛీ! ఆడదాని మీదికి చెయ్యెత్తావ్.

ఎస్. ఐ. : కదలండి!

రంగ : కాస్త ఆగండి.. ఒక్కమాట. సీతా!

ఇల్లాలు : (ఏడుస్తూంది)

రంగ : ఏడవకు. మన బతుకు ఇంతే పాపాయి జాగ్రత్త! వాడికి జ్వరం తగ్గిపోతుందిలే. డాక్టరుగారూ...

డాక్టరు : రంగా!

రంగ : (డాక్టరు చేతులు పుచ్చుకొని ఏడుస్తూ) నా పిల్లలు జాగ్రత్త! నేను జైలునుంచి వచ్చేటప్పటికి - వాళ్ళుంటారో - లేదో!

డాక్టరు : రంగా-వూరుకో- నీ పిల్లలకు నా ప్రాణంఇస్తాను.

మున : తీసుకెళ్ళండి! అందర్నీ జయిలులో వెయ్యండి. ఆ పిల్లల్ని గొంతు ల్నులిమి చంపేసిపోండి. (పడిపోయాడు.)

ఇల్లాలు : (తిరిగి చూచి కెవ్వుమని కేక వేసింది.)

(అంతే)



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA131B127 |
| పుస్తకం పేరు | ఎన్ జి ఒ గుమాస్తా |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 111 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 1,2 |
| తయారు చేసినది | APSGY |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |